ఆంధ్రపత్రిక

హైదరాబాద్‌పై పాకిస్థాన్‌లో దుష్ప్రచారం
3-వ పేజి

The Andhra Patrika, Madras. Regd. No. M. 1118 Vol. 36 No. 7 THURSDAY 7th APRIL 1949 వెల ఒకఅణా Founder: K. Nageswara Rao

# చెన్నపట్నంపైతమహక్కులనువదులుకుంటేసాధ్యమైనంతత్వరలో ఆంధ్రులకుప్రత్యేకరాష్ట్రం

## కాంగ్రెస్ అగ్రనాయకత్రయ సంఘం నివేదిక: కార్యవర్గామోదం

## భాషారాష్ట్రవిభజనకార్యక్రమాన్నికొన్నేళ్లు వాయిదావేయడం అవసరమని నిర్ణయం

**న్యూఢిల్లీ, ఏప్రిల్ 5: "మిగిలిన భాషారాష్ట్రములవిషయమై ఆలోచించుటకు పూర్వము ప్రప్రథమంగా ఆంధ్రరాష్ట్రమును గూర్చి దానిని ఏర్పాటు చేయు విషయమునుగూర్చి పరిశీలించి ఆలోచించుటకు వీలున్నది" అని నేడు కాంగ్రెసు కార్యవర్గం భాషారాష్ట్ర సమస్యపై అగ్రనాయకత్రయ సంఘ నివేదికను గురించి తన అభిప్రాయమును నిరూపించుచు తీర్మానించినది.**

### వచ్చేఏప్రిల్ 1 వ తేదీకి ఆంధ్రరాష్ట్రం

చెన్నపురి, ఏప్రిల్ 6:
ఆంధ్రపత్రికప్రతినిధి, మద్రాసునూత్న ప్రధాని కుమారస్వామి రాజాగారితో ఆంధ్రరాష్ట్రము విషయమై ఏమైనా నిర్ణయమైనదా అనగా నేడు కాంగ్రెసు కార్యసంఘమువారు ఆ విషయమును గూర్చి చర్చించుచున్నారనియు, కొన్ని షరతులకు లోబడినట్లయితే 1950 ఏప్రిల్ 1 వ తేదీకి ఆంధ్రరాష్ట్రము నిర్మాణము గావచ్చునని ఢిల్లీలో తాము వార్తను వింటిమనియు, అంతకు మించి తమకు తెలియదని చెప్పిరి

భాషారాష్ట్ర నిర్మాణము విషయమై పరిశీలించుటకు జయపూరు కాంగ్రెసు సభవారిచే నియమింపబడిన ముగ్గురు అగ్రనాయకుల కమిటీ తయారుచేసిన నివేదికను నేటి సాయంకాలము ఢిల్లీలో సమావేశమైన కాంగ్రెసు కార్యవర్గం పరిశీలించి ఆనివేదికను హర్షించి స్వీకరించుచున్నట్లు తీర్మానము చేసెను.

"దేశములోని వివిధ భాషారాష్ట్రముల నిర్మాణమును కొలది సంవత్సరముల కాలమువరకు నిలిపియుంచుట అవసరము. ఈ కొలది సంవత్సరముల కాలములో మనము యాభాషారాష్ట్ర సమస్యమూలంగా అన్యాయత్తచిత్తులము కాకుండ అంతకంటె అత్యంత ప్రధాన విషయములగూర్చి శ్రద్ధగా యోచించవలసియున్నది" అని ఆ తీర్మానమున సూచించెను.

### బేషరతుగా కెరేన్ తిరుగుబాటుదార్ల లొంగుబాటు

### ఇన్‌సీనులో యుద్ధవిరమణఉత్తరువు

రంగూన్, ఏప్రిల్ 6: జనవరి మాసాంతమునుండియు బర్మాప్రభుత్వముపై తిరుగుబాటు జరుపుచుండిన కెరేను తెగజాతివారి అగ్రేసరుడు సా-బా-యూ-గ్యీ లొంగుబాటు షరతులపై సంతకముచేయుటకు గాను రక్షకపరివారములతో నేడు రంగూన్ వెళ్లెనని ప్రభుత్వానుకూల వార్తయొకటి తెలిపెను. "బేషరతుగా లొంగిపోవు సూచన కెరెన్ తిరుగుబాటుదార్ల పక్షమున గావింపబడుటచేత రంగూన్ ఉత్తరమున 11 మైళ్ళ దూరమునవున్న ఇన్‌సీనులో యుద్ధమును విరమించవలెనని ఉత్తరువు జారీయయ్యెను. ఈ సూచనను కెరేన్ నేషనల్ యూనియను అధ్యక్షుడు సా-బా-యూ-గ్యీ గావించెను.' అని వార్త తెలుపుచున్నది.

అధికారప్రకటన త్వరలో వెలువడునని అనుకొనుచున్నారు.

ఈ పట్టణమును కరేన్ తెగజాతుల వారు ఫిబ్రవరి 2వ తేదీన వశపరచుకొని వశపడే ప్రభుత్వసేనలు గావించిన దాడులను తిరుగగొట్టిరి. ఏప్రిల్ 1వ తేదీలోపుగా యుద్ధము విరమించినచో వారిని క్షమింతుమని సూచనను గతమాసములో బర్మా ప్రభుత్వమువారు కెరెన్లకు గావించి యుండిరి.

ప్రధాని థాకిన్ను నేటిరాత్రి బర్మా ప్రజల నుద్దేశించి బ్రాడ్‌కాస్టు ఉపన్యాసము గావించుచు ఒక మాసములోపుగా ఎన్నికలు జరుగునని చెప్పెను.

కెరెన్లతో మాత్రమేగాక ప్రభుత్వసేనలు కమ్యూనిస్టులతోను మాన్స్ తెగజాతి వారితోను, పీపిల్స్ వాలంటీర్ సంస్థకు చెందిన 'వైట్ బాండ్' వారితోను పోరాడుచున్నవి.

### బర్మా సోషలిస్టుపార్టీ మాజీ అధ్యక్షుని అరెస్టు

రంగూన్, ఏప్రిల్ 6: బర్మా సోషలిస్టు పార్టీ మాజీ అధ్యక్షుడు అయిన యు. కే. గియాని సైనికాధికారులు అరెస్టుచేసి, రంగూన్ సమీపంలో నిర్బంధించిరని తెలియవచ్చినది. బర్మా మంత్రివర్గంలోనుంచి సోషలిస్టుపార్టీ సభ్యులు అందరూ కొద్దిరోజులక్రితం రాజీనామా యిచ్చిరి. సోషలిస్టుపార్టీసభ్యులు రాజీనామా యివ్వడం, పార్టీ మాజీ అధ్యక్షుడు అరెస్టుఅవడం యించుమించు ఒకేసారి జరిగినవి. యు. కే. గియా బర్మా ప్రభుత్వంలో గతించిన జులైవరకు వాణిజ్య సప్లైశాఖా మంత్రిగా పని చేసెను.

### శ్రీమతి విజయలక్ష్మి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: అమెరికాకు ఇండియా రాయబారిగా పోవుచున్న శ్రీమతి విజయలక్ష్మి పండిత్ మాస్కో నుంచి ఇవాళ న్యూఢిల్లీకి వచ్చెను.

భారతదేశమునకు సింహద్వారమనదగిన బొంబాయి నగరాన్ని ఏ ఒక్క భాషాప్రాంతములో గాని చేర్చుట అసంభవమనీ, ఆ నగరము ప్రత్యేక పరిపాలిత ప్రాంతముగ వుండక తప్పదనీ, బొంబాయినగరం విషయమున చెప్పేవాదన మద్రాసుకు వర్తించదనీ, ప్రత్యేకాంధ్ర రాష్ట్రమును వాంఛించేవారు దానిపై హక్కును వదులుకోవలెననీ కూడ అగ్రత్రయ నివేదిక హెచ్చరిక చేసినది.

ఉత్తర హిందూస్థానములోని వేర్వేరు రాష్ట్రముల సరిహద్దులను—సవరించు విషయము యెంత యుక్తముగా కన్పించినప్పటికీ ఆ విషయమును తలపెట్టుటకు యిది తగిన తరుణముకాదు అని ఈ నివేదికలో కలదు.

జయపూరు కాంగ్రెసుచే నియమింపబడిన కమిటీలో డా॥ పట్టాభిసీతారామయ్యగారు, సర్దారు వల్లభాయి పటేలుగారు, పండిత జవహర్‌లాలు నెహ్రూగారు సభ్యులుగా నియమింపబడిరి. థారుకమిటీ నివేదిక అనంతరము విషయములను ఆమూలాగ్రముగా పరిశీలించుటకు యీ కమిటీ నియమింపబడెను. ప్రస్తుత సంఘర్షణ పరిస్థితులను గమనించి, యిదివరలో కాంగ్రెస్ మహాసభ చేసిన తీర్మానములను పురస్కరించుకొని భాషారాష్ట్ర నిర్మాణ విషయమును పునఃపరిశీలన చేయు నిమిత్తమై పై జెప్పిన నాయకత్రయ కమిటీ నియమింపబడెను. ఆ కమిటీ నివేదికను కాంగ్రెసు కార్యవర్గమువారు ఇండియా గవర్నమెంటుకున్నూ రాజ్యాంగపరిషత్తు అధ్యక్షునకున్నూ అందజేసెదరు.

### అగ్రనాయకత్రయ సంఘ నివేదిక

పైజెప్పిన ముగ్గురు నాయకులుగల కమిటీ తయారుచేసిన నివేదికలో యీ క్రింది రీతిగా వ్రాయబడెను.

ఆంధ్ర కర్నాటక కేరళ మహారాష్ట్రములను కొత్తరాష్ట్రములను ఏర్పాటుచేయు

(4-వ పేజి చూడుము)

## రాష్ట్ర నూత్న మంత్రివర్గ ప్రమాణస్వీకారం



మదరాసు నూతన మంత్రివర్గాన్ని గురించి కుమారస్వామి రాజాగారు రాష్ట్రపతి పట్టాభిగారిని సంప్రదించిరి. చిత్రంలో కామరాజనాడార్, రాష్ట్రపతి, కుమారస్వామిరాజా, భక్తవత్సలంగార్లు కలరు.

### చైనాలో యుద్ధ విరమణ: సంధిచర్చలు ప్రారంభం

### యాంగ్సీ ఉత్తరతీరానకమ్యూనిస్టు సేనల ఉపసంహారం

నాంకింగు, ఏప్రిల్ 6: చైనా కమ్యూనిస్టులు యాంగ్ట్సీనది ఉత్తర తటమునుండి తమ సేనలను ఉపసంహరించుకొన నారంభించిరి. నదికి ఎగువను, నాంకింగువద్దనున్న ప్రభుత్వ స్థావరముపై పది రోజుల నుండి గావించుచున్న దాడిని ఆపివేసిరి. యుద్ధవిరమణవార్తలు, కమ్యూనిస్టు సేనల ఉపసంహరణ వార్తలు వచ్చిన సమయముననే పీపింగులో కమ్యూనిస్టులకును, చైనా జాతీయప్రభుత్వ ప్రతినిధులకును రాయబారములు ప్రారంభమైనట్లు వార్తలు వచ్చినవి. ప్రభుత్వ రాయబారవర్గ నాయకుడు జనరల్ చాంగ్-చీ-చూంగ్ పీపింగ్ రాగానే రాయబారములకు ఉపక్రమణికగా సంభాషణలు ప్రారంభమయ్యెనని, ఈ సంభాషణలు ప్రారంభముననే భగ్నమగు స్థితి ఏర్పడెనని విశ్వసనీయములగు వర్గములద్వారా తెలియుచున్నది. ప్రభుత్వ రాయబారవర్గ నాయకుడు జనరల్ చాంగ్ పీపింగుకు వచ్చుటకు పూర్వము జనరలిస్మో చాంకేషేక్ వద్దకు వెళ్లియుండుటచేతను, తమ దృష్టిలో చాంకేషేక్ ప్రధాన యుద్ధనేరస్థుడగుటచేతను, జనరల్ చాంగ్‌తో రాయబారములు నెరప కమ్యూనిస్టులు ఆక్షేపణ జరిపిరి. జనరలిస్మో చాంగ్ కేషేకునుంచి జనరల్ చాంగ్ ఉత్తరువులు పుచ్చుకొనెనని కమ్యూనిస్టులనిరి. రాయబారములు భగ్నమగునట్లు కనిపించెను. కాని ప్రభుత్వ రాయబారవర్గమునందలి మరియొక సభ్యుడు షౌ-లి-ట్సే రాయబారాలు భగ్నముకాకుండా చేసెను. మర్యాదసూచకముగా జనరల్ చాంగ్ జనరలిస్మో చాంకేషేక్ వద్దకు వెళ్ళెనని ఆయనచెప్పి కమ్యూనిస్టులను సంతృప్తి పరిచెను.

అంతట కమ్యూనిస్టు రాయబారవర్గ ప్రతినిధి ప్రభుత్వ రాయబార వర్గము వారితో యిట్లు చెప్పెనని తెలియుచున్నది:—"మా షరతులపైననే మేము రాయబారములు జరిపెదము. ఎందుకల్ల ననగా దీర్ఘకాలము అంతర్యుద్ధము జరుగుటవల్ల ప్రజలు చాలా కష్టముల పాలైరి. చైనా అంతటిని వశపరచుకొను సైనిక బలము, రాజకీయ పలుకుబడి మాకుకలదు."

కమ్యూనిస్టుల ఈ కాఠిన్యమును ప్రతిబింబించు ప్రకటన నొకదానిని గతరాత్రి కమ్యూనిస్టు రేడియో గావించెను. కమ్యూనిస్టులు కసాయివారి ముఠాయని, సూచక

8 వ పేజీ చూడుము

### సిరియా కొత్త ప్రభుత్వం

#### త్వరలో బ్రిటన్ గుర్తించే సూచన

డెమాస్కస్, ఏప్రిల్ 6: బ్రిటన్ రెండు మూడు రోజుల్లో సిరియాలో ఏర్పడిన కొత్త ప్రభుత్వాన్ని గుర్తింపవచ్చునని తెలుస్తున్నది. బ్రిటిష్ పత్రికల, బ్రిటిష్ రేడియో వైఖరి చాలా తృప్తికరంగా ఉన్నదని సిరియన్ రాజ్యాంగ తంత్రజ్ఞులు అభిప్రాయ పడుచున్నారు.

### 'విదేశపెట్టుబడి ఇరుపక్షాలవారికిలాభంగాఉండాలి'

### ప్రభుత్వవిధానాన్నివివరిస్తూ ప్రధానమంత్రిప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: "పరస్పరము ప్రయోజనకరముగానుండే షరతులమీద విదేశపెట్టుబడులు ఇతోధికంగా భారతదేశానికి లభ్యంకాగలందుకు తగినట్లుగా భారతప్రభుత్వము తమ విధానము తయారుచేయగలదు." అని భారతప్రధాని పండిత నెహ్రూ విదేశ పెట్టుబడుల గురించి నేడు పార్లమెంటులో చేసిన ప్రకటనయందు తెలిపెను.

"ప్రస్తుతం దేశంలోఉన్న పరదేశసంస్థలకు, భారతీయసంస్థలకు వర్తింపజేసే అవనవు నియమాలనుగాని నిబంధనలనుగాని వర్తింపచేయు ఉద్దేశ్యము ప్రభుత్వమునకు లేదు. దేశమునందలి యాసంస్థలన్నిటికి వర్తించు నిబంధనలు,షరతులకుమాత్రమే లోబడి విదేశ పెట్టుబడిదారులు లాభములను ఆర్జించుటకు అనుమతింప బడుదురు.

"ప్రభుత్వము తప్పనిసరిగా ఈ పరాయి దేశముల నిర్వహణలోఉన్న పరిశ్రమల స్వాధీనం చేసుకొనుట జరిగినపుడు, న్యాయమైన, సరియైన పరిహారమును చెల్లించుటను గూర్చి ఈ విషయం ఇదివరకే ప్రభుత్వ విధానమును వివరించుచు చేయబడిన ప్రకటనలో విస్పష్టము చేయబడెను." అని ప్రధాన

[8 వ పేజీ చూడుము]

### రాయలసీమ,సర్కారులకు సమ ప్రాతినిధ్యం

### పాతమంత్రులు కూర్మయ్య,అవినాసలింగం, గురుపాదంగార్ల నిర్గమనం

చెన్నపట్నం, ఏప్రిల్ 6: శ్రీ కుమారస్వామి రాజాగారి మంత్రివర్గము నేడు అపరాహ్ణము 3 గంటలకు సెక్రెటేరియట్‌లోని మంత్రివర్గ మంటపంలో ప్రమాణంచేసి అధికారముకు స్వీకరించెను

ఉదయము 11 గంటలకు శ్రీ కుమారస్వామి రాజాగారు గిండీ వెళ్లి గవర్నరు భావనగర్ మహారాజాగారికి మంత్రులజాబితా అందజేసిరి. శ్రీ రాజాగారు, సంజీవరెడ్డిగారు, భక్తవత్సలంగారు నిన్న సాయంత్రం ఢిల్లీనుండి తిరిగి వచ్చిరి.

తమ గదులకు వెళ్లి లాంఛనంగా అధికారాన్ని స్వీకరించి కార్యక్రమం ప్రారంభించారు.

శ్రీ కుమారస్వామిరాజాగారు గవర్నరుకు జాబితా సమర్పించిన అనంతరము ప్రభుత్వ అతిథిభవనమునకు వచ్చి విశ్రాంతి



శ్రీ నీలం సంజీవరెడ్డిగారు



ప్రధాని కుమారస్వామిరాజాగారు

తీసుకొనిరి

ఈ క్రింద పేర్కొనబడినవారిని ఆయా శాఖలకు మంత్రులుగా శ్రీ రాజాగారు నియమించిరి

శ్రీ కుమారస్వామి రాజా ప్రధాని పబ్లిక్, లా అండ్ ఆర్డర్

శ్రీ ఎమ్ భక్తవత్సలం పబ్లిక్‌వర్క్సు ఇన్‌ఫర్మేషన్

డా॥ టి యస్ యస్ రాజన్ ఆహారము, రిలిజియస్ ఎండోమెంట్సు

కల్లూరి చంద్రమౌళి స్థానికపరిపాలన, సహకారము

బి గోపాలరెడ్డి ఆర్థికశాఖ, వాణిజ్యపన్నులు, రిజిస్ట్రేషన్ ఏజన్సి, ఎలెక్షన్లు మోటార్ రవాణా శాఖలు

కె మాధవమేనన్ వ్యవసాయము, న్యాయశాఖ, జైళ్లు, అడవులు

ఎ బి షెట్టి విద్య, ప్రజారోగ్యము, వైద్యము

నీలం సంజీవరెడ్డి మద్యనిషేధము,గృహనిర్మాణము

బి పరమేశ్వరన్ హరిజనాభివృద్ధి, గ్రామాభివృద్ధి, ఖద్దరు అభివృద్ధి

హెచ్ సీతారామరెడ్డి పరిశ్రమలు, కార్మిక, రెవిన్యూశాఖలు

కొత్తమంత్రివర్గంలో, తెలుగుమంత్రులకు సంబంధించినంతవరకు సర్కారు, రాయలసీమ జిల్లాలకు సమ ప్రాతినిధ్యం

8వ పేజి చూడుడు

